శ్రీరస్తు.

# కాళింగమర్దనము.

ఇది

మంగు వేంకటరంగనాథరావువలన

ముద్రించి ప్రకటింపబడియె.






మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

1914

శ్రీవేంకటేశ్వర విద్యానాగర ముద్రాక్షరశాల.


వెల 0—1—0



శ్రీరస్తు.

# కాళింగమర్దనము.

సీ. శ్రీవిభుఁగొల్చి శంకరుని సన్నుతిజేసి వాణిజాసనుమదిఁగోరికొలిచి
గణపతిపూజించి ఘనులైన యామాని వ్యాసాదికవులను వరుసదలచి
ముందుసరస్వతిమోదముతో నూహించియందముశృంగారమమర జేసి
భూసురపాదాబ్జముల భృంగమై యొప్పి వాసనగల కాళిదాసు దలచి
గీ. కృష్ణచరితల వేడుకగీలుకొల్చి, పరగకృతిజేతు జగములఁబ్రౌఢిమీర
తప్పుగలదేనికవులారదగిననేర్పు,లొప్పుమీరగదిద్దుచునొనరవలయు.

ఏకతాళము—భావములోతగుదేవిని యమృతపు - తావినిమదిసిరిదేవినుతింతుఁ ॥ ౧ ॥ అతులితముగ మునితతులనుబ్రోచిన చతురునిగౌరీపతినిభజంతుఁ ॥ ౨ ॥ ఏణాక్షినిమృదుపాణినిపద్మజు - రాణినిజక్కనివాణిదలంతుఁ ॥ ౩ ॥ పాయకనమస్కృతిసేయుమునులకిష్ట - దాయకుడైన వినాయకుగొలుతుఁ ॥ ౪ ॥ ప్రవిమలరసగుణభావాలంకృతకవులగునాదిమకవులనుతింతుఁ ॥ ౫ ॥

వ - అనికృతిరచనాపరుండును దేవదేవుండునునైన శ్రీపార్థసారథిస్వామినేమని వర్ణింపుచున్నాడు ॥

జంపె ॥ యదుకులంబునబుట్టి యతులమన్నించుటకు - సదయుడై శ్రీపార్థసారథై వెలసెఁ ॥ ౧ ॥ బృందావనమునను బొందుగానెలకొన్న - చందనార్చిత పార్థసారథై వెలసెఁ ॥ ౨ ॥ పార్థివేశ్వరులెల్ల బ్రీతిలింపగాజాల - బార్థునకుసారథై ప్రౌఢిగావెలసెఁ ॥ ౩ ॥ కౌతునకుదండ్రియై ఖలులఖండింపుచును - సంతతము శ్రీపార్థసారథై వెలసెఁ ॥ ౪ ఇలనుదిరువలికేణినెలమిపై భవములకు - సలలితముగపార్థసారథై వెలసెఁ ॥ ౫ ॥

వ॥ అనిమరిన్నేమని కీర్తించుచున్నాడు॥

త్రిపుట॥ ధరణిభారముదీర్చుకొరకై దానవులఖండించి మించిన పరమపావనుడైన శ్రీహరిభక్తిగొలుతుగ॥ ౧॥ పాండవుల మన్నించి ద్రౌపదిపాలగలగి - మించిన దండిరాజులగొట్టినట్టిమాధవునిగొలుతుగ॥ ౨॥ వింతగారేపల్లెలోపలసంతతముగోవులనుబ్రోచిన - వంతకారై వెలయుశ్రీహరివరునగొలుతుగ॥

వ॥ అని వినుతిసేసి యాదేవునకు మస్త్యంతంబులు సెప్పినట్లు తొటువతెలను॥

అర్ధచంద్రికలు॥ పూతనగూల్చిన భూపాలునకుగ॥ ౧॥ మద్దులగూల్చిన ముద్దులహరికిన్॥ ౨॥ గుల్లులదుంచిన మధునైరికినిగ॥ ౩॥ కంసునిగొట్టిన కంజాక్షునకుగ॥ ౪॥ గిరివేలునెత్తిన కేశవునకును॥ ౫॥ దురితములణచినమురవైరికిని॥ ౬॥ కరిపతిబ్రోచినకమలాపతికిగ॥ ౭॥ శకటునిగూల్చిన సర్వేశునకుగ॥ ౮॥ గోవులబ్రోచిన గోవిందునకుగ॥ ౯॥

వ॥ అని యంకితంబుగా నాయొనర్చంబూనిన మహాప్రబంధంబైన కాళింగమర్దనంబను యక్షగానంబునకు కథాక్రమంబెట్టిదనిన॥

ద్విపద॥ శ్రీరామకృష్ణులు చెన్నొందివేడ్క - ధారుణీభారంబు దగదీర్చుటకును - దేవకీవసుదేవదేవులకర్థి - బావనంబుగబుట్టిబహుచరితముల - నందునియింటను నయముతో బెరిగి సుందరాకారత శోభిల్లి మరియు - గోపాలకులతోడకొమరొప్పనాడు - నేపారగోవులనెసగమేపుచును - బృందావనంబను పుణ్యదేశమున - మందారచంపకమాధవీవకుళ చందనపున్నాగసహకారమిళిత - కుందబృందంబులు కొమరుదీపింప - గోవర్ధనముచెంత గోవులనుమేప - బోవుచునొకనాడు పొలుపొందమరియు - కాళింగదర్పంబుగడగిలిచుటకు - బాలురతోననెసంకజాక్షుండు - పసులకుమేతలుబహుళంబులును వెసగలునేడుడు వేగబోదాయు ననిచెప్పి కృష్ణుతో సవనహూర్తి - చనినీయమునానది చాయలకేగ।

ముత్యమువోల్కెయమరినటుస్సృష్టియనుకరించునా జెలనయధవందనా॥

వ॥ అప్పుడామడుగుదగ్గిరికివచ్చి శ్రీకృష్ణుండు బాలురతో నేమను చున్నాడు.

క॥ గోపకులతోడకృష్ణుం, డేపారకవచ్చియందు నెసనెసమదికిన్
గోపాలబాలకులతో మేపులుగలవిందు, పసులమేపుదమనియెన్॥

జంపె॥ అక్కడక్కడగదుపులందందిపచ్చికల - జొక - మగమేయు చును సొంపుతో మెరసెన్ ॥ ౧ ॥ గోపాలులందరును గోవిందుతో గూడి యూచల్దిచిక్కములనటువిడిచినపుడు ॥ ౨ ॥ బంతులుగగూర్చున్న బాలురకుగృష్ణుండు - వింతకాజద్దులను వేడుకనొసర్చెన్॥ ౩ ॥ సద్దులందరుగుడిచి చాలుగానామడుగువద్దజేరి జలమువలసినటుత్రాగెన్ ॥ ౪॥ నిద్రపోయునరీతినెగడిబాలకులెల్ల భద్రముగ మడుగుదరిబవళించిరపుడు ॥ ౫ ॥ బాలురునుగోవులునుచాలమూర్ఛలనొంద - బాలకృష్ణుడుమూచిబాగుగాలేపెన్ ॥

వ॥ ఆసమయంబున నెటువలెనుండెను॥

ఏకతాళం॥ అప్పుడు బాలకులందరు లేచిరి - పొల్పుగనిద్రలుపోయిన రీతిన్ ॥ ౧ ఆవేళభాస్కరుడటుపడమటికై వేగమేయతిగెనువింతగనపుడుకన్ ॥ ౨ ॥ మందలదోలుకమరి శ్రీకృష్ణుడు - పొందుగరేపల్లెపురము జేరెగన్ ॥ ౩ ॥

వ॥ అయ్యవసరంబున రేపల్లెవారెదురుగావచ్చిరటయెటువలెను॥

అటతాళం — వేణుగానము వీనులనువిని వేడ్కసేయ తమతమయేని లోచనలందరునుదామెదురుకొనిరి ॥ ౧ ॥ వచ్చిగౌగిటజేర్చి బాలురమచ్చికలతో - నింగ్లకుమచ్చకంతులుదోడ్కొబోయిరిమమతమీరన్ ॥ ౨ ॥ సూదరాంగియశోదకృష్ణునిజూచివేడ్క - కౌగిట - మందరోద్ధరునెత్తికొనిచనెమగువవేగన్ ॥ ౩ ॥

వ॥ అప్పుడు కృష్ణునియింటికిదోడ్కొనిపోయిరటయెటువలెను॥

ద్విపద॥ అంతనాతల్లియు నాకృష్ణునకును ॥ వింతగామజ్జనము వేడ్కతో జేసి పీతాంబరముగట్టి పృథ్వీశ్వరునకు - భ్యాళిగాతిలకంబుఘనతతో॥

ట్టి పైడిపళ్ళెరములో బాయసాన్నములు దడయక బెట్టించదనకుమారు నకు - నందునిపొత్తునయుమొప్పగుడిచి - పాందుగాదొడపైని పానగ నిద్రించె అపుడు గోపికలతో నందరుగూడి - వేవేగ బాలురీ విధమెల్ల జెప్ప మందభామలువచ్చి మరియశోదకును యందరు జెప్పిరియామగువతోడ - అమ్మరో వినవమ్మ యీకృష్ణుడిపుడు - క్రిమ్మర బాలుర కదుపులతోడ కాళిందితీరంబుగదలి తాబోయి - బాళితో నచ్చటపసులను నేడు - మేపివ చ్చినజాడ మేమిపుడు దెలసి - చెప్పెదమిదిమీకు చెల్ల బోయమ్మ - నీకొ డుకుదుడుకులనింతింతలనుమ - మాకుచెప్పగరాదు మానినిమణిరో - ఇ దిబుద్ధిగాదని హితవుగాలెన్న - మదిరాక్షి కృష్ణునకుమరి చెప్పవమ్మ ॥

వ ॥ అప్పుడు మందభామినులందరు సెప్పినవిని యశోదాదేవివా రితో నేమనుచున్నది ॥

జంపె ॥ ఊఱకయ చెప్పెదరు కారుమాటలుసుతుని - దారి తెలియక మీరుతగబల్కుదగునే - ౧ ॥ ఆమడుగుత్రోవ నెవరైనబోవుటకును - భా మలారాగలదెబలిమిజూడంగన్ ॥ ౨ ॥ మాచిన్నికృష్ణుండుమరితోవదా నెరిగి ఏచందమునబోవు నేణాక్షులారా ॥ 3 ॥ ఊరకేయీరీతి కారువాదా డెదరు - దారిగాదిదిమీకుతరలాక్షులారా -

వ ॥ అనినవిని గోపికలందరుదమతమయిండ్లకుబోయి సుఖనిద్ర లుపోయిరట అంతట శ్రీకృష్ణుండెటువలెనుండెను ॥

త్రిపుట ॥ అంత వేకువజాము వేళను నలరకృష్ణుడు లేచిగ్రక్కున - తెం పుతో నాసపణమును సాధింపదలచి ॥ ౧ ॥ చుక్కపొదుపున లేచికృష్ణుడు చూడకుండను వీధులందున - గొక్కరోకోయనుచుగూసెనుకోడివలెను ॥ ౨ ॥ కోడికుయ్యగ లేచివేగమెగోపబాలురుదొడ్లలోపలదూడలన్నియువిడి చిపిలికిరి పాడిపసులన్ ॥ 3 ॥ పేఱుపేఱునబిలచిగోవుల పితికెపాలునుకృ ష్ణుడప్పుడు - గారవంబున జిద్దికుడిచెరిఘనతమీరన్ ॥

వ ॥ అట్టియెడ నెటువలెనుండిరి.

అర్ధచంద్రికలు—ముద్దువెన్నెలవిశదయొద్దికతో కట్టిన్ ॥ ౧ ॥ ఊరగా యలునంచునొప్పగాబెట్టిన్ ॥ ౨ ॥ చిక్కములబిగియించె చెలువమీరం

గె॥ ౩ ॥ బాలురమునుగాముకొనె సద్మనాభుండు ॥ ౪ ॥ వేణునాదము సెనికె వేగబూరించెఁ ॥ ౫ ॥ మందలనుదోలుకొని మాధవుడుగదలెఁ ॥ ౬ ॥ కదలిపోనగజూచి కాంతయశోద ॥౭॥ బుద్ధిసెప్పగవచ్చె పురుషోత్తమునకు॥

వ॥ ఇవ్విధంబున శ్రీకృష్ణుండు మందలదోలుకొనిపోవు సమయంబున యశోదాదేవికి వందనంబుచేసిన తనయునియెత్తి యక్కునంజేర్చి చెక్కిలిముద్దాడి శిరమాఘ్రాణించి కౌగిటంజేర్చి యేమనుచున్నది॥

ద్విపద—అపుడాయశోద యాతనయునిగూర్చి - చెప్పెబుద్ధులువాని చిత్తంబుగలుగ - మాతండ్రికాళింగుమడుగులచాయ - నేనెఱుంగనసైన నేగుటవలదు - కాళింగుమడుగులో ఘనమైనపాము - బాలునగరతునని పంతంబుమెరసి - తలయెత్తిచూచుచుదాగియుండును - జలములవిషము లజ్వాలగ్రక్కుచును - పిన్నతనమున నీవుబీరంబుమెరసి - పన్నగానటుబోవనందురావన్న - అనిబుద్ధిసెప్పిన యాకృష్ణుడపుడు - వినికన్నులనుమూసి నెరిచియుల్లసిల్లెను॥

వ॥ అప్పుడు యశోద సెప్పినవిని మిక్కిలి భయపడినవానివలె గోపాలుండు తల్లితోనేమనుచున్నాడు॥

జంపె—ఇక్కడికి నాహాముగ్రక్కనుపచ్చునా - మక్కువతో దెల్పవేమాయమ్మనీవు ॥ ౧ ॥ చెప్పగాభయమయ్యె చిన్నవాడనుగాన - చప్పుడుసేయకతలుపుచాటున నేయుందుఁ ॥ ౨ ॥ ఏటికృష్ణుండనినీడలేకనిపల్కి మోదమలరగతల్పుమూసిబిగియుంచు ॥ ౩ ॥ ఆతలుపుదాటియది యావలికివచ్చెనా - యాయడ్డగోడనేనట్టుదాటిపోదుఁ ॥ ౪ ॥ అడ్డగోడయుదాటియావలికివచ్చెనా - యటకమీదికినెక్కియణగియుండెదను॥౫॥ బాపగానటకపైచయ్యనసెక్కెనా - నెలతగోవర్ధనము నేనెక్కిపోదుఁ॥

వ॥ అప్పుడు భయపడుచున్న తనయునింజూచి యశోదాదేవివానితోనేమనుచున్నది॥

త్రిపుట—అన్నభయపడనేలనీకికపదియునిక్కడరాదుగామరి - తిన్నగాగోవర్ధనమువర్తిగినేవు॥ ౧ ॥ అనుచునుతొసకుభయముకీర్చుచనా

దారిచియుండెనా - వనజనేత్రుఁడుముంచిదనుచును వరుస వెడలెఁ ॥ ౨ ॥ బాలురందరిఁగూర్చుకొనుచును బాగుగామందలనుదరుముచు - బాలకృష్ణుడు దల్లికినిదా బ్రిణతి సేసెఁ ॥

వ ॥ అయ్యవసరంబున శ్రీకృష్ణుండు బాలురంగూడుకొనిగదలివచ్చుమార్గంబెట్టులనుండెను ॥

దిండిమను — చల్లనినవరాన్న పిల్లఁగ్రోవిచేత మల్లెమొగ్గలదండమరిసి గనింప ॥ ౧ ॥ ఉల్లములరంజిల్లగొల్లభామలుకెల్ల జెల్లుగయాలలు సెలఁగిపాడుచును ॥ ౨ ॥ అందెలుగజ్జెలుసందడమ్రోయఁగపొందుగనడిచెను పురుషోత్తముఁడు ॥ ౩ ॥ నల్లనిమేఘమునలువొందుమేనితో జెల్లుగపింఛము సిరమున మెరయఁగ ॥ ౪ ॥ ముల్లోకములేలుమురవైరియప్పుడువల్లెవిజయము లవాడుచు వెడలెఁ ॥ ౫ ॥

సీ ॥ అంతట శ్రీకృష్ణుడప్లైనెపలంగ సూర్యోదయంబయ్యె సొంపుమీర । కమలముల్వికసించె ఘనచీకటులుమాసె చుక్కలుమాసెను చొక్కముగను । పక్షులుసెలరేఁగి బాగుగాగూసెను వృక్షముల్వికసించె వేడ్కమీర । మధుపానములుజేసి మత్తభృంగంబులు ఝుంకారరవములుచాలఁబ్రబలె ॥

తే ॥ గీ ॥ గానసీరితి వేడ్కలుగలిగియుండ । బాలురనుగూడిశ్రీకృష్ణుడు ప్రౌఢిమీర మెల్ల మెల్లనసఖులతో మెల్లమొదవ । మాధవుడువచ్చెనప్డు డామడుగుదరికి ॥

వ ॥ అప్పుడు సూర్యోదయంబైన యత్క్షణంబ బెట్టులనుండెను ॥

త్రిపుట — అరుణభానుడుపూర్వదిక్కున నమరియుండినచందమప్పుడు - స్థిరముగాదేవతలుపట్టినదీపమనగా ॥ ౧ ॥ తరుణభానుడు జూడనొప్పెను సురలుదేవేంద్రునకుపట్టిన - గురుతరంబులసూర్యపట్టపుగొడుగో యనగ ॥ ౨ ॥ పదిలుడయి కాళింగునణచను బాలుడయిహరివోవగనితా- నుదయపర్వతమెక్కి సూర్యుండొప్పుమీరెఁ ॥

వ ॥ అప్పుడు శ్రీకృష్ణుండును బాలురును మడుగుదగ్గరికి వచ్చి యెట్టులనుండిరి ॥

కృష్ణతలము త్రొక్కుచు బాధ్యుజూచి - రూపించి పడి గెలువొ జూచుపెడ తె ॥

వ ॥ అప్పుడు కాళింగుండు కోపావేశంబున నబ్బాలునింజూచి యేమ నుచున్నాడు.

జంపె ॥ ఇదివరకు నెవ్వండు నీమడుగు సన్నిధిచి - పదిలముగ రాడు నాభయముదానెరిగి ॥ ౧ ॥ వీడెవ్వడొక్కండు వెరపింత లేకయును - పోడిమిశో నామడుగు పొందుగాజొచ్చెఁ ॥ ౨ ॥ శంకయించుక లేక చాలగర్వము మీరికొంకకనుమడుగిప్పుడింకగావలచెఁ ॥ ౩ ॥ అనిపలికి రోషమున నా కృష్ణుంజేరి పెనగిచుట్టుకబోరెబీరంబుతోడఁ ॥

వ ॥ అనిపలికి యివ్విధంబున గాళింగుండిట శ్రీకృష్ణుని తోడంబెనం గుచుండ నడ రేపల్లెలోనున్న యశోద మొదలగువారలకవశకునములుగ నిపించెనట యెటువలెను ॥

జంపె—మూకంబులొకకొన్ని గుంపుగూడుకగూసె - గాకములు చెలరేగికలగివాపోయెఁ ॥ ౧ ॥ కమలనేత్రియశోదకన్నులదరగజొచ్చెన మితముగనురగంబులడ్డముగదిరిగెఁ ॥ ౨ ॥ అవశకునములు జూచియా మందవారెల్ల। వివిధభంగుల గలగివింతనేడనిరిఇదియేమొయీవింతయీ పల్లెలోనిప్డు - డొదిగియవశకునంబు లొక్కటిగబుట్టెఁ ॥

వ ॥ ఇవ్విధంబున నవశకునములంజూచి యందరుగుంపులుగూడుకొ ని యేమనుచున్నారు ॥

కురుచజంపె—వినరమ్మ యోభామలారా కృష్ణుని వెతకకుండుట మనకు మేరా ॥ ౧ ॥ దిగులుపుట్టెనుమనసులోన నేడంతో మగువలారా యేమి సేతుఁ ॥ ౨ ॥ పొద్దున నేముం దెవరిమోము - జూచితిమొ పొందగలిగెను దానిఫలము ॥ ౩ ॥ వింతగానవశకునములు రే - పల్లెలో - నంతకంతకుబుట్టదొణగెఁ ॥ ౪ ॥ నందుడునుమందాదులిట్లు - గూడుకొని - యందవిలపించుచుండంగఁ ॥ ౫ ॥ అందరు వేవెడలిర ప్డు - యశోదయును - ముందుగానుండి వెతుకుచును ॥

వ ॥ అప్పుడునందుండు యశోద మొదలగు రేపల్లెలోనుండు వారం దరు వెడలివచ్చుమార్గఁ బెటువలెనుండెను ॥

కట యెటువలెనుండెను ॥

ద్విపద—అక్కడగోవులు నాబాలురెల్ల - బొక్కచువాపోవభూ
మిపైబోరల - గడ్డియునీరునుగవలంబులుడిగి - దొడ్డుగాఘోషించుదూ
డలుపసులు - హాకృష్ణకృష్ణయనియందరుగూడి - యేక్రియవచ్చెదో
యిందునీవనుచు - బాలిచేబాలురుపలువరింపుచును - వాసిదప్పినరీతివ
గలబొందుచును - ఆరీతినుండంగ నాయశోదయును - వారిజాక్షులుదా
మువారినిజూచి - ఇదియెల్లె శ్రీకృష్ణుడీమడుగులోన - పదిలుడైదుమికె
నేభయమింతలేక - ఇత్తెరంగంతయు నెరుగంగమీరు - నాతోడజెప్పం
డునావత్సలార - అనినయశోదకునాబాలురెల్ల - వినుపింపదొణగిరివృ
త్తాంతమంత - హనుమంతుడెక్కినట్లాకొమ్మకెక్కి - పనిబూనిదుమికె
నుబాలకృష్ణుండు - దుమికెనప్పుడు మే[illegible]డరిచూచితిమి - మామది
నింతైన మేమెరుగమమ్మ - యెరిగియుండితిమేని యీకదంబమున -
వంచించికట్టుదుము వద్దనుండుదుము - బుద్ధులుసెప్పుదుముపొలతిమీక
డకు - వడివడిగావచ్చివార్తజెప్పుదుము - అనిపల్కబాలురనాయశో
దయును - విసయంబుతోసుతుని వేగమేజూచి - పెనగికృష్ణునిపాముబి
రంబుతోడ - ఘనమైనపడిగెలగరచుచునుండ - చూచికన్నులనీరుజలజ
లరాల - నేడీయశోదదానిట్లనిపలికె ॥

వ॥ అప్పుడు తనయునింజూచి యశోద యేమనిప్రలాపించుచున్నది ॥

అటతాళం—నీలవర్ణుడనీదు జాతకమరిసిచూచి - మానులులీలమీ
రగజగములన్నియు నేలుననిరీ ॥ ౧ ॥ చిన్నికృష్ణాపాముచేనీవుజిక్కబడు
దు - వనుచువారెన్నరైరోఘనులుమును పెకన్నతండ్రి ॥ ౨ ॥ నిన్నుబాసి
కనెట్టులోరుతు నిమిషమైనను నిన్నునిమ్మహి - కన్నులెత్తినన్నుజూడర
యన్నకృష్ణా ॥

వ॥ అని మరిన్నేమని ప్రలాపించుచున్నది ॥

జంపె—నాతోడబలుకరా నన్నుమన్నించరా - నాకోపలపైవ్రా
లునాముద్దుచిలుక ॥ ౧ ॥ అందెలవియసియాడమందహాసముతోడ - సుం
దరాకారననుజూపునాతండ్రి ॥ ౨ ॥ అఘరుపాటునవచ్చి యప్పొనుబట్టు

అర్ధచంద్రికలు — బాలురయుడుగుల భావింపుకొనుచుఁ ॥ ౧ ॥ పడ
ఱుపుమున తెరువు భావింపుకొనుచుఁ ॥ ౨ ॥ అక్కటక్కట జాబియుం
డంధవతికి ॥ ౩ ॥ ఏమిసేయుదు కృష్ణుడెంతకగనుపించఁడు ॥ ౪ ॥ ఈకృ
ష్ణునెన్నటికియేనుగనుగొందుఁ ॥ ౫ ॥ హాకృష్ణకృష్ణయనియనాని పైబొ
రలుఁ ॥ ౬ ॥ ఏమిసేయుదుమమ్మ యోయింతులారా ॥

వ ॥ ఇవ్విధంబున యశోదప్రలాపించుచువచ్చుమార్గంబున రోహి
ణీదేవిచేరంజని యూరడిల్లంబలికెనట యెట్లనవలెను ॥

అటతాళం — ఎందుకేయోయమ్మ వగవగనింతసేపు - జెల్లదువాం
దుగాభయమొందులేదా పుణ్యానకును ॥ ౧ ॥ ఆదేవదేవుండైన కృష్ణు
ని దెలియుమిప్పుడునీవును భావమున దలపోయుమమ్మశంకబాస్కి ॥ ౨ ॥ పు
ట్టినప్పుడే ప్రాతకివిదాబట్టిదానింజంపడే - దట్టితనమునసకట తైత్యునిగొ
ట్టలేదే ॥ ౩ ॥

వ ॥ ఇవ్విధనంబునరోహిణీదేవి చెప్పినవినియురలకె వెతుకబోవుచుమా
ర్గంబున నేమనిప్రలాపించుచున్నది ॥

యాలలు — మాధవుడెచ్చటనున్నాడో తెలిపవేదయైన సుతునిపాదు
కొనినీవుబ్రోవవె యోభూమిదేవి - మోదమలరనాకుజూపవే ॥ ౧ ॥ న
ల్లనికాంతులవానిజల్లనిచూపులవాని - యుల్లమలరనీవుబ్రోపవె- యో
గగనవాణికల్లగాదు నాతో తెలుపవే ॥ ౨ ॥ నెమలిపింఛములవానినెమ
లవేణురవమువాని - గమలనేత్రములుగలవానిఁ - యోరవిందులారా-
మోదముతోమీరుబ్రోవుండు ॥ ౩ ॥ గోవులనుగాసెడువానిగోవర్ధన
మెత్తినవాని పావనుడైన నాపట్టిని యోదిక్కులారా - కావరేమిరాదిన
యగాడి ॥ ౪ ॥ వెన్నదిన వన్నెగానికన్నెలవలపించువాని - చిన్నవైన
చిన్నికృష్ణుని - యోతరువులారా - కన్నులారనాకుజూపరే ॥ ౫ ॥ అం
దెలునువ్వులుగలవందముగనవెలుగుచుకో - సూదపాంగుండయినకృష్ణు
ని - యోపక్షులారా - పొందుగానునాకుజూపరే ॥

వ ॥ ఇవ్విధంబున బ్రలాపించుచు వెతుకునమయంబున బాలురకూ
తలుగోపురవరియు వినుకిషనజ్ఞాపబంధిసగుడు సమ్మునుసేరవచ్చి

కోని - మోదమలరగన్నులను మాయనేగందురా ॥ ౩ ॥ ఇదియెవరునాక
న్నులిపుడుమూసిరియనుచుగది - సిమూపున నెక్కగందునోనేనురా ॥ ౪ ॥
గోవులనుపాలింప గోపకులాలింప రావయ్యనాతనయరమణామైయుందు ॥
౫ ॥ నీతోడ లోకమ్మై నేడుమేముండెదము - నాతోడు నీడయని నమ్మి
న్నాను ॥

వ॥ ఆసమయంబున మఱియు నెటువలెనుండిరి ॥

ఏకతాళం—అంతయశోదయునామడుగుదరికి - వంతముతోవచ్చిప
డుటయుదలచి ॥ ౧ ॥ అందుబట్టలునపుడు బిగ్గించి - పొందుగనడిచిరిపో
లతికిమునుపె ॥ ౨ ॥ మడుగులోబడుటకుమరిడగ్గరిలంగ - వడిగరాము
డువచ్చివలదనిపలికి ॥ ౩ ॥ అడ్డంబుగాజొచ్చి యతడువేగమున - పేర్మి
తోసంకరిబిలుచుకచనిర్మెరా ॥ ౪ ॥

వ॥ ఆసమంబున శ్రీకృష్ణుడందరదనమాయచేతమూర్ఛబోవజేసితా
నెట్టువలెనుండెను ॥

త్రిపుట—వంతగించుచుఫణియుగృష్ణునిబడిగెలన్నియు - ద్రిప్పియుగ్ర
త - నంతకంతకుజేరెనుడివడనంగములను - అట్టియెడనాఫణినిగృష్ణుండ
ణచిపట్టియు వివిధభంగుల - వింతగావిదళించివేసెనువేగమునను - దూ
రముగబడి ఫణియునిప్పుడు ఘోరరవమునవచ్చిచుట్టెను - ధీరులైయా
యిరువురొకమొగిబోరిముణుగరా ॥ మునిగినంతటబోకనిరువురుగణనమిం
చినసాహసులునై - ఫణియుగృష్ణుడు బోరిరిప్పుడు వంతమునను ॥

వ॥ అట్టియెడ మఱియు నెటువలెనుండిరి ॥

జంపె—ఇత్తెరంగున బోరి రిరువురొకజాముమఱి - ఖ్యాతిగాలోక
ములుగడగడనువణకరా ॥ ౧ ॥ అప్పుడా హరిజూచి యాఫణీశ్వరువాల -
ములకుబట్టుకదిప్పి యిలపై నిప్పై చెరా ॥ ౨ ॥ వేసికృష్ణుడుదానిపీవుపడిగె
లమీదు - దలలపై కెక్కి తాదాండవంబాడెరా ॥

వ॥ అప్పుడు శ్రీకృష్ణుడు కాళింగునిపై తాండవంబాడెనట యెటు
వలెను ॥

ఢింకిమము—చల్లనిసవరత్న పిల్లంగ్రోవిచేత మల్లెమొగ్గలదంష మ

రిసి...ండ ॥ ౧ ॥ తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త తద్ధిమితక్కిట-పద తాండవంబులపడిగెలపై నుండివివిధముగ నాడేవింతగా...డు ॥ ౨ ॥ తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త తద్ధిమితక్కిట ॥ ౩ ॥ బలుగర్వములణఁచిపడిగెలపై ద్రొక్కిచలపట్టివాఁడే సేసరిసిజోదరుడు త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త తద్ధిమితకిట ॥ ౪ ॥ గజ్జలుమువ్వలుఘలుఘలు మ్రోయగజిందులుద్రొక్కెనె చిన్నకృష్ణుం త్తాధిత్తాధిత్త త్తాధిత్తాధిత్త ధిత్తాధిత్త తమిద్దక్కిట ॥

వ ॥ ఆసమయంబున శ్రీకృష్ణునిమీఁద పుష్పవర్షంబుఁగురిసెనట యెటువలెను ॥

ఏకతాళం—అప్పుడు హరిపై నతివేడుకతో - వారిరపువ్వులవర్షముగురిసెన్ ॥ ౧ ॥ అచ్చరలాడిరి యంబరవీథిని హెచ్చుగవాద్యము లెలముతో మ్రోసెన్ ॥ ౨ ॥ అనువుగతుంబురుడా నారదుడును - గనుగొని చేసిరిగానోత్సవముల్ ॥ ౩ ॥ దేవతలందరుదివిజయమనగా - భావజు తండ్రియుఫణిపై నాడెన్ ॥

వ॥ అప్పుడు కాళింగుండెటువలెనుండెను ॥

అటతాళం—దానవాంతకుడాడేడిండిమ తాళతతుల - ఫణికిని - ప్రాణములునిట్టటు బడిమరిపడిగెలదిరెన్ ॥ ౧ ॥ అదరి శిరములునలగగామరి చెదరేగుడ్లున్ గిఱగిఱ బెదరితిరుగగదలచిచాలగభీతినొందెన్ ॥ ౨ ॥ తెలిసితాగాళింగుడప్పుడు దేవుడనుచు మనమునదలచిభయముననుండె మరితాదైన్యమంది ॥ ౩ ॥

వ॥ అప్పుడా కాళింగుండు దేవదేవునిపరాక్రమంబుఁదలపోసిఘోషింప దొణంగె నాకవళీయాలకించియంతఃపురంబుననున్న స్త్రీలు వెడలివచ్చిరటయెటువలెను ॥

ద్విపద—అంతగాళింగుని యతివలు దెలిసియంతఃపురంబు నడలుచు వెడలిపన్నగకన్యలుపణతులై దుగురు తిన్నగానడచిరాదీనతనొంది - అన్నులనడుములు హంసయానములు - వన్నెమీఱినయట్టివనజనేత్రములు-బింబోష్ఠములుచంద్రబింబాననములు - క్రొమ్ముపండ్లపోల్కి నెగడుపాలిం

ష్లు తిన్నెలసమమైన తెరవపిరుదులును - పన్నగసరిటికంభములు[illegible]లు - రంజిల్లుచీరయురమణమైయొప్పముంజేతికంకణంబులుమెరయుచుండ నీలంపుకురులునునెగడుముంగురులుచాల చెన్నొందిన సరసవాక్యములుకలనాగకన్యలుకణగిశోకమున - పలవించివచ్చిరిప్రాణేశునకడకు ॥

వ॥ అప్పుడానాగకన్యకలువచ్చి శ్రీకృష్ణునిపాదంబులకొరగి యేమని ప్రార్థించుచున్నారు ॥

జంపె—శరణునందకుమారశరణుశ్రీశమందారశరణుపాపవిదూరశరణుగంభీరా - శరణచ్యుతానంతశరణుపరమానందశరణునత్యానందశరణుగోవింద ॥ శరణుదానవహరణశరణుత్రిభువలభరణశరణుపంకజచరణు శరణుశ్రీరమణా శరణుసద్గుణజాలశరణు సన్నుతలీలశరణుగోపికలోల శరణుగోపాలా ॥

వ॥ అని మరినేమనికీర్తించుచున్నారు ॥

అటతాళం—ఎన్నిజన్మములెత్తినోకాని యెరుగలేముపతికిని చెన్నుమీరగచిన్నిపదములు సిరసునమరెఁ ॥ వారిజాసనుడాదిగాగలవరుసమునులుసురలును చేరికనుగొనలేనిపదములు శిరమునమరెఁ అఖిలలోకములందుపూజలనందినట్టిపదములుసకలభీకరమైనశిరమునజాలనమరెఁ ॥

వ॥ అనిమఱియు నెటువలెగొనియాడుచున్నారు ॥

కురుజాపె—పురుషభిక్షముపెట్టియికనూ - మన్నించు - పురుషోత్తమామమ్ము కృపతోఁ ॥ పతిభిక్షముపెట్టి మమ్మూపాలింపుపలుమారు మీకుమ్రొక్కెదమూ ॥ ఓదేవకరుణింపుమయ్యా యీవేళమాదేవుడవుగావుమయ్య మీపాదములశిరములానఁ వెలయగనుమాపతికిగలిగెనీఫలమూ మాతండ్రిమిముబాగడగలమాయజ్ఞాన - మలముచేమిము తెలియగలమా ॥

వ॥ అని యిట్లనేకవిధంబుల బ్రార్థనజేసి నాగకన్యకల శ్రీకృష్ణునిజూచి వేడుకొనిరటయెటువలెను ॥

ఆ॥ గీ॥ మమ్ము బెండ్లిసేయు మాప్రాణవల్లభ। బ్రాణమిచ్చికావుభక్తవత్సలసేయుపెండ్లినిత్యంబు। భద్రింబుపిన్నునాటిపెండ్లిపెండ్లిగదు

వ॥ అప్పుడు శాంతమూర్తియై గోపాలమూర్తి ప్రణతులను గృపజూచెనట యెట్టనవలెను॥

అర్ధచంద్రికలు—ప్రణతులగృపజూచిపద్మనాభుండు - మర్దనముచాలించిమహిమీదదుమికె - దుమికినంతట ఫణియుదొరలిధరబడిమూర్ఛపడికొంతమూర్ఛిల్లిప్రాణములుదెలసె చె - దరినప్రాణములజేర్చి ప్రట్టుచునుహీనస్వరముతోడనిట్లు దేవునకుకరములుమొగిడ్చియాకమలాక్షుజూచి - ప్రార్థింపదొణగె నాఫణివరుండప్పుడు॥

ద్విపద—దేవజగన్నాథ దేవాదిదేవ దేవకీతనయ యోదతిజాతిశరణు అఖిలలోకారాధ్యయాశ్రితశరణు సకలజీవాధార సర్వేశశరణు నిగమగోచరవంద్య నిరుపమాకార అకలంకగుణనిధి యబ్జాక్షశరణు మత్స్యమైజలధిలో మరియు వేదములు జొచ్చితెచ్చినయట్టి యచ్యుతశరణు కూర్మమైకుధరంబుగుదురెత్తినట్టి - వారిజాసనవినుతవైకుంఠశరణు - వారాహరూపమై వసుధను దెచ్చి పదపడినిలిపిన పరమాత్మశరణు ఇలను నరహరివిగ్రహమై యలదైత్యుద్రుంచి బాలునిగాచిన బహుపుణ్యశరణు వామనరూపివై వసుధయాచించి బలివంచించిన దేవపతినీకుశరణు - పరశురాముడవగుచు బహుభూమిపతుల వరుసగాగొట్టిన వైకుంఠశరణు - దశరథాత్మజుడవై తపనవేషమున - దశకంఠుగూల్చిన దైత్యారిశరణు బలుడవై తగమించిభానుజగూల్చి - చెలువమై ప్రబలిన శ్రీధరశరణు గోపాలమూర్తివై గోవులబ్రోచి రేపల్లెవెలసిన శ్రీపతిశరణు కలికిరూపంబవై ఖలులనుద్రుంచి - పలుమారువెలసిన పరమాత్మశరణు కరిమొరవిని యమ్మకరిద్రుంచి కరిని- స్థిరముగాబ్రోచిన శ్రీహరిశరణు - క్షీరాబ్ధిశాయి లోకేశలోకములరక్షించినట్టి నారాయణశరణు - హీనుండననుగావుమిసకోటితేజ దానవాంతకమహాద్రిత్రాణదక్షకేశవమాధవకృష్ణ ముకుందవాసుదేవమహేశవారిజనాథ వాసవార్చిత పాపటపతిరయ్యనపాదభక్తోద్ధూతపాపజీమూతభాగవతావనభవరోగహరణఆగమనందిత యపరాధినేను మనమందహంకారమమర్షరోషమున మొనసిమిమ్ముజూడవంచుముట్టితి దేవకోపాగ్నివిషయుక్తకోరలుగల్గు - పాపజాతినినన్ను ప్రా

లించుదేవ - కోరినీవిచ్చినగుణములేకాక వేరొండులవిగావు వేదాంత వేద్య - శ్రీపాదపద్మము శిరముననుంచునాపుణ్యమెట్టిదోనలినాక్షవినవె స నకాదులునుగూర్చి చర్చింపలేని - కనుగొనియమరులు గొనియాడలేని లేని బ్రహ్మరుద్రాదులు భావింపలేని యిమ్మహాపాదంబు లేనుగనుగొం టి - పావనుండనునై త్రిభువిలోననేను - సేవకుంగాజేసిచేపట్టునన్ను - అ భయంబొసంగియోయవతారదేవ - యుభయవిభూతినాకొసగవేదేవ అ జ్ఞానినపరాధినతిమూఢునన్ను - సుజ్ఞానిగాజేయుజూడవేకొండీ ॥

వ॥ అపుడు కాళింగుడు మఱియు నేమనికొనియాడుచున్నాడు ॥

అష్టకము ॥ సావేరిరాగం—ధరణిభారముదీర్పను - మఱిదైత్యరా జులదునిపనుధరణిలోవసుదేవునకునుతనయుడై జన్మించియు గరిమతో డుత నందునింటనుగారవంబున - వెలసినసరవరోత్తమనన్ను బ్రోవవే నందగోకులనందనా - గోవులనుబాలింపనుమఱిగోపకులలాలింపను సేవ తోడుతనవతరించక భావమునభూజములచే ॥ సేవితుడవై సట్టియదుకుల శ్రీకృష్ణుడై విలసిల్లిన - నవనిధామనన్ను బ్రోవవె నందగోకులనందనా బా లుడై పూతకనిబట్టి ప్రాణములవధియింపవా బాలరాక్షసమాయలన్ని యుసారెసారెకుమాన్పవా - బాలుడనినేనిన్ను సోకి పాపజాతినిసేనయాన లినలోచననన్ను బ్రోవవె నందగోకులనందనా ॥

వ॥ ఇవ్విధంబున కాళింగుండు గొనియాడిన విని శ్రీకృష్ణుండేమని యానతిచ్చుచున్నాడు ॥

జంపె ॥ అభయంబులిచ్చితీయఖిలలోకంబులను - విభవంతోనీవు వె లయుమురగేంద్రా ॥ వినుమునీభయమునను వేడుకతోనీదరినిగనుగొనగ లేరెట్టి ఘనులైనగానీ - నీవువచ్చినమొదలునీలైజీవములెల్ల దాపుగని యీడలముదాగరాకుండుర ॥ ఎచ్చోటనుండుదువో యచ్చోటికేపోవు- మిచటనుండగనీకునేమికారణము ॥

వ॥ ఇట్లు శ్రీకృష్ణుడానతిచ్చిన విని కాళింగుడేమనుచున్నాడు ॥

త్రిపుట—దేవమునునేనుందు లవణద్వీపమందునసర్పరాజై - కావ రంబువైనతేయునిగదసిపోరని ॥ వానిబలిమికినిలుపజాలకవచ్చివేగమేము

డుగుజొచ్చితి పొంగిగరుడుకిందుఃజరియింపంగరాదూ - వైనతేయునినీడ సోకినవ్రయ్యలై పడుమనుచుతనునిర్జ గనుచునొకముని శాపమిచ్చెనుగ రుణలేక అప్పుడిట్లని శుకులుజెప్పిన నతనితో నారాజువేగమెనిపుణుడై తామొక్కిపలికెను నేర్పుమీరగ వినగవినగనువేడుకయ్యెడువిష్ణుకథ లు చెవులకుతనకుతెలియగనానతియ్యవె తపసివర్యా ॥

వ॥ ఆసమయంబునం బరీక్షిన్నరేంద్రుండు శుకబ్రహ్మర్షిని౦జూచి గరుడునికిం గాళింగునికి విరోధంబెట్లుగలిగె గరుడునికి శాపంబెవరిచ్చిరి గాళింగునకు శాపమువచ్చిన కతంబెద్దియది విశదంబుగా నాకానతిండన నానరేంద్రునితో మునీంద్రుండేమనుచున్నాడు ॥

అటతాళం—వినుము లవణద్వీపమందున వెలయుచున్నజాతులు - వైనతేయుడునచటనుండురు వయిభవమునా ॥ నెలకునెలకును వైనతే యునకెలమినాహారం - బొసంగియు - నెలమితోడుతబుత్తురతనికి యిత వుగాగ ॥ చలముజేగాళింగుడనినిసడ్డసేయకుండిన నలగిఖగపతియతని పైబడియపుడుగినిసె ॥ రెక్కలునుగొనిచరచిబలిమినిముక్కుతోడ జీరెను మక్కువతొ వాడందునిలువకమడుగుజొచ్చె ॥

వ॥ అప్పుడు కాళింగుండు మడుగులోసం బ్రవేశించి యెటువలె నుండెను ॥

ద్విపద—అప్పుడాయురగేంద్రు డాహారకాంక్షమచ్చికతో నొకమ త్స్యమునుబట్టి - నటువేగమునమ్రింగిబలిమినిపుడు - నెట్టనుపడలెను నీటిలోనుండి యామత్స్యబృంగంబు లతిసంఖ్యలగుచు - నామడుగులో నుండి ఆర్పుచువెడల - ఆదరనొకమునియాఘోషమరసి - మనమునగో పించి మఱియిట్లుబలికె ఓదురాత్మకతొడకనీవు - పారవచ్చితివియాప క్షేంద్రుకతనవచ్చి నాయాజ్ఞనువారించిమించివచ్చి యీమడుగులోసా రమీనునొకటి - పట్టుకమ్రింగితి పాపకర్ముడవు - గానగరుడునీపమేని పైసోక పడగలువ్రయ్యలై పడుమనుచునపుడు - తడయకశాపంబుదగ నిచ్చె నతడది మొదలు కాళింగుడామడుగులోన ॥ బదిలుడై దాగుండె ప క్షితులు దానుగరుడుడాతీరమున గర్వంబుమెఱసి చెరియింపుచుండెనువా

లవేమకలమునిసన్నిధిని నొక్కఘనవ్రతమునను దినమునాహారంబుదీర్చ దెచ్చుకొనుచు - భక్షింపజూచి యాబ్రాహ్మణోత్తముడు - పక్షీంద్రునీ వుమరిబహుమానములను - మాసన్నిధికిదెచ్చి మనకిత్రము సేయ - భానురంబుగనలదు పలుమారునీకు అనుచుచెప్పగ వినకనాగ్రహంబునను చలముసేయగజూచి సంయమివరుడు - పక్షీంద్రయీదరి ప్రబలివచ్చితేని పతమువ్రీతిగిచటబడుమనిశపించె మునిశాపమందుకొనిమనమున వెరచిఖగనాథుడేగె నక్కడనిల్వలేక - అనుచునాశుకయోగియంతయుదెలియ - దప్పకవినుపించె ధరణీశునకును యిదినీకుజెప్పితినికమీద వినుము ముదముతో వినుపింతుముందరికథయు అవనీశనీకునుహరిచరిత్రంబు వివరించితెలిపెదవినుమనిపలికె కాళింగుడపుడు గడుదీనవృత్తి బాలకృష్ణుని పాదపద్మములబడియు - మనమునహరినిల్పిమరియూరకున్న - గనుగొని కృష్ణుండుగరుణతో బలికె ॥

వ॥ అయ్యెడ శ్రీకృష్ణుండు గాళింగునితో నేమనుచున్నాడు ॥

క॥ ముదముననాపదములుదల, బదిలముగా వెలయుచుండబక్షీంద్రుం డన్ । గదియంగ వెరచుగనుకొని, కదలుము నీపురికి యనెనుగమలాక్షుండర్ ॥

వ॥ అప్పుడు శ్రీకృష్ణుండు మరియు నేమనియానతిచ్చెను ॥

జంపె—పుణ్యచరితంబిదియు పాపహరితంబిదియు - యిదిదేవమంత్రమిదియిహపరంబులకూ ॥ ఇలలోనుభక్తితోనేఘనులుచదువుదురో - యనఘవారలబలిమినంటకుమునీవు ॥ కాళింగయీకథనుగరుణతోనేవరేని యిలనుపాడినమరియు నెలమివ్రాసినమూ అనుదినమువిన్నను యధికులై వెలయుదురు - హరిలోకమునువారలందియుందురూ ॥ ఆయురారోగ్యంబులష్టసంపదలకును - బాయకనుయుండునా పావనులయిండ్లన్ ॥ చాలసంతోషములు సౌఖ్యంబులును గలిగి బాలురను గోవులను బాగుగావెలయున్ ॥

అటతాళం—అనుచుబ్రీతినియానతిచ్చిన హరినిజూచి - యప్పుడు - వినుతిజేసిరినాగకన్యలు వినయనితోడన్ - దేవనీమహిమంబుదెలియగ దివి

కాళింగ - జాలరు భావమునగనుగొనగజాలదు పద్మజుండహా॥ దివిజ గోత్కులుదీరథన్యులమైతిమప్పుడూ - మీరలు - నేమమునమాగృహమునకువిచ్చేయుడనిరీ ॥

వ॥ అనవుడు శ్రీకృష్ణుండు మహాసంతోషంబున గాళింగు నగరంబునకు వేంచేసెనట యెటువలెను॥

ఏకతాళం—ఇంపుగకృష్ణుని యింటికితోడుక - నేపారగజనిరింతులువేడ్క ॥ బంగరుపీఠముపయి హరినునిచిరి పొందుగజేసిరిపూజలతనికిన్॥ శృంగారంబుగసంగనామణులును - శృంగారించిరిచిన్నికృష్ణునికిన్ ॥ కుండలములువరకోటితేజములుగుదంచకిరీటముదగవుగనిడిరీ ॥ బంగరుగజ్జెలుపైడంజెలుమరిరంగుగమొలనూలంగుళికములున్ ॥ సందిటతాయెతులందముగలిగిన - కిస్తులమర్చిన కౌస్తుభమనియున్ ॥ పులిగోర్పతకములిరికంకణములు తళుకుమణులుమించు తాళబిళ్ళలనూ మంచిగశృంగారించిరిమగువలు - పేటముత్యాపుసరుల్ దేవ్రులకప్పుడున్ ॥ కనకాంబరములు ఘనమణిసొమ్ములు - గనుగొనియిచ్చిరి గానుకగాను ॥

జంపె—అంతశ్రీకృష్ణునకు నానావేళభక్తితో - నైర్మల్యనమస్సతో నెలమివేడుకగా పన్నీరుగంధంబుబాగుగా నలదుచును - తిన్నగాకస్తూరితిలకమిడిరప్పుడూ ॥ గంధాక్షితలచేఘనునిపూజించిరి - సుందరాంగులందారుచూచి శ్రీహరికి ॥ తమదృష్టితగులునని దానవారికివేగమగువలందరుగూడి మాటిమాటికినీ ॥ వింతగాహారతులు వేడుకలరంగదెచ్చి - ముత్యాలహారతులు ముదముతోనిడిరీ ॥ అంగనలుశోభనములపుడుపాడుచుతెచ్చి - మంగళముపాడిరామాధవునిజేరీ ॥

వ॥ అనసమయంబున నాగకన్యకలుశోభనములుపాడిరటయెటువలెను॥

శోభనపుపాట—శోభనము దేవకీ - సుతుడయిన దేవునకు - శోభనముగుణనిధికి శోకాపహారునకు శోభనమే - పరమపావనునకును పంకజనేత్రునకు సర్వభయనాశనునకు కమలనాభునకు ॥ శో ॥ నందకుమా

ష్ణుండు - బాలురతోగూడి బంతిగూర్చుంచ - సాలయశోదయుసరగున నపుడు - చిక్కంబులన్నియుజక్కగావిడిచీ - గ్రిక్కునవడ్డించె గలవం టకములు ॥ ఊరగాయలతోడనొప్పమీరంగమారువడ్డించెనుమదిరాక్షి యపుడు - బుజ్జగింపుచుసుతుని పొల్పుమీరగను - బొజ్జనిండగగుడిపెపు రుషోత్తమునకు - భానుడప్పుడుగ్రుంకె పడమటదెసనూ - మానుగమం దలమరిదోలుకొనుచు - వేణునాదముచెలగవేడ్కతోనపుడు - జాణు డై సుందరసఖులతోనడిచె - పౌరులుపోవగ జూచిపురమువార్లు - వడి వడినడకతోవచ్చిరాప్పుడిక ॥

వ॥ అయ్యవసరంబున రేపల్లెకునచ్చినకృష్ణునకు గోపకన్యకలు దృష్టిపరిహారముగా హారతులిచ్చిరట యెట్టులనెను॥

మంగళము—రామునకు లోకాభిరామునకు యదు వంశసోమునకు బాహుబలభీమునకునూ - శ్యామునకు భక్తపరిపాలున కు భద్రిగిరిధామునకు కారుణ్యధామునకునూ ॥ జయమంగళం ॥ సారు నకుదురితసంహారునకు నూపజితమారునకు గుణమణీహారునకు • మేరుసమ ధీరునకు వేదాంతసారునకు సుగుణాలవాలునకునూ ॥ జయ ॥ బాలున కుగరుణాలవాలునకు కనకమయచేలునకు భాగవతలోలునకునూ- బా లునకుగోపికాలోలునకు దయచేయకాలునకు వేణుగోపాలునకునూ ॥ జయ ॥ కృష్ణునకునురవైరి జిష్ణునకుద్విజసురో - చిష్ణునకుశ్రేమంకరోష్ణ నకునూ - విష్ణునకుబాలార్కధిష్ణునకుసద్యోగ - రిష్ణునకుభువనవర్ధిష్ణున కునూ ॥ జయమంగళంనిత్యశుభమంగళం ॥

వ॥ అట్టిమెడ సూర్యాస్తమయంబాయెనటయంతట వారువారుపు రంబునకుపోయిరటయెట్టులనెను ॥

సీ॥ అనవుడు శ్రీకృష్ణుడామందవార్లు మచ్చిక రేపల్లెవొచ్చిరపుడు- తమతమవీధులతమమందిరములకు బాలురగోవులదోలివిడిచి ఆరాత్రి యందరు నతిసంభ్రమములతో వెలయుండిరి ప్రజల్వేడ్కమీర మాధవు

ఆవేళమజ్జనంబొనరించి భోజనంబులుజేసె పొందుగాను - గానసీరీతిది
నములుగడుపవలయు - మానవేశ్వర కృష్ణుండు మహిమనరకరుణసీరీతి
బాలురగలసియాడు - వినుము రేపల్లెలోహరి వెలసియుండు ॥

అటతాళం—ధరణిభారముదీర్పకొరకై దానవారి - బాలుడై ధర
ణిలోనీరీతి వెలసెను ధర్మమూర్తి ॥ దుర్జనులశిక్షించి తనుసద్దోషము
గను - నమ్మిన సజ్జనులపాలింపుచుండెను చాలవేడ్క - అందముగ
రేపల్లెవాడలోనందనికిని - వేడుక పొందుగా వర్తింపుచుండెను భూ
వరేణ్యా ॥

ద్విపద—అనిరుక్తిసే మనోహరసి పేరఘునుడైన యదువంశగంభీరు
పేర - దేవకీసుతువాసుదేవుని పేరగోవులగాచినగోపాలు పేర - నగధరు
పేరపన్నగతల్ప పేర - నిగమగోచరు పేర నిఖిలాధారు పేర - అండజవా
జవర్యంకుని పేర - గజరాజరక్షణగంభీరు పేర - నిలనుతిరువలికేణినెలమి
వేడుకల - చరియించుహరిపార్థసారథీ పేర - సంకీర్తంబుగదత్వదాత్యంత
నియతి - పంకజాక్షునిపాదపద్మసేవకుడు - సన్నుతిమీరంగసరసుడో
యనగ - వన్నెగానరసింహవరపాలితుండ - సనుద్ఘష్టవశ్రేణిఘునదా
సుడనగ కామతేజుండ వేంకటపతికవిని - చాలంగిశ్రీపార్థసారథీకరు
ణ - లలితమాశబ్దరరమణమైయొప్ప - రమ్యమైనవర సాలంకారస
రణి - కమనియ్యమై యీకాళింగుకథయు - యక్షగానంబునిక్షతో జే
సి - సరసవాక్యంబులజాలవేడుకల - పరమాత్మశ్రీకృష్ణుపాదంబులకు
ను - పరమభక్తినిసమర్పణముగావించి - వివరించితినికథ విఖ్యాతి వెలయ
విబుధశ్రేణికిసంస్తుతతరమగుచు - ధరణిలోనాచంద్రతారకంబగుచు -
నుండగావుతకృష్ణమండనంబగుచు॥

కాళింగమర్దనము - యక్షగానము,

సంపూర్ణము.

# ప్రకటన.

గోదావరి.డి॥ కాకినాడనగరం మసీదువద్ద నెం 1862వ యింటియందుంచబడిన శ్రీ వేంకటేశ్వర విద్యాసాగర ప్రెస్సు మేనేజరు అందు బుక్కుసెల్లర్సనగు నావద్ద తప్పులులేకుండ మంచికాగితములపైని ముద్రించబడిన అనేకసంస్కృత - ఆంధ్ర వచన పద్య ఛందక యితిహాస పురాణ కంపెనీనాటక వీధినాటక పెద్దచ్చుశతకములువగైరాలు సరసమైనధరలకు విక్రయించబడును. కావలయువారలు నాషాపును కనుగొని కొనవలయునని కోరుచున్నాను

ఇట్లు విధేయుడు,

మంగు వెంకటరంగనాథరావు.



